# వెర్రిబాగుల జాన్, బంగారం సంచి

తిరిగి చెప్పింది: వర్జీనియా, బొమ్మలు: జెస్



# వెర్రిబాగుల జాన్, బంగారం సంచి

తిరిగి చెప్పింది: వర్జీనియా, బొమ్మలు: జెస్



అనగనగా జాన్ అనే అబ్బాయి ఉండేవాడు. ఊరి బయట ఒక చిన్న ఇంటిలో అమ్మతో కలిసి అతను ఉండేవాడు. జాన్, వాళ్ల అమ్మ డబ్బున్న వాళ్లు కాదు, కానీ వాళ్లు చాలా సంతోషంగా ఉండేవాళ్లు.

జాన్‌ది మంచి మనస్సు. మంచిగా ఉండటానికి ప్రయత్నించేవాడు. వాళ్ల అమ్మ చెప్పింది చేయాలని అనుకునేవాడు. అయితే ఎప్పుడూ పొరపాట్లు చేస్తుంటాడు, కిందా మీదా అవుతుంటాడు. అతడు చేసే పిచ్చి పనులు చూసి అందరూ అతనిని వెర్రిబాగుల జాన్ అనేవారు.







ఒక రోజు జాన్‌ని వాళ్ల అమ్మ పిలిచి, "నువ్వు బజారుకు వెళ్లి ఒక కోడిని అమ్ము. ఆ డబ్బుతో బంగాళాదుంపలు కొనుక్కుని రా. మరిచిపోకు, దారిలో కలిసిన వాళ్లతో మర్యాదగా ప్రవర్తించు," అని చెప్పింది.

"అలాగే, అమ్మా," అన్నాడు జాన్.

ఒక కోడిని తీసుకుని బజారుకి బయలుదేరాడు జాన్. నడుస్తూ హుషారైన పాట ఒకటి పాడుకుంటున్నాడు. కొంచెం సేపటికి అతనికి పెళ్లి చేసుకుని ఇంటికి తిరిగివస్తున్న బృందం కనిపించింది. కుటుంబ సభ్యులు, స్నేహితులతో కలిసి పెళ్లి కొడుకు, పెళ్లి కూతురు నడుస్తున్నారు.





ఒకసారి అంత్యక్రియలకు వెళ్లిన విషయం జాన్‌కి గుర్తు వచ్చింది. ఆ కుటుంబంతో మర్యాదగా ఎలా మాట్లాడాలో వాళ్ల అమ్మ చెప్పింది. పెళ్లి కొడుకుని, పెళ్లి కూతురిని అలాగే పలకరించాడు.

"మీకు జరిగినదానికి నాకు చాలా బాధగా ఉంది," అన్నాడు జాన్.

పెళ్లి కొడుకు, పెళ్లి కూతురికి కోపంతో ముఖం ఎర్రబారింది. "మాట్లాడే పద్ధతి అది కాదు!" వాళ్లు అన్నారు. "ఈసారి, నువ్వు సంతోషంగా ఉండాలి. టోపీ ఊపుతూ, శుభాకాంక్షలు అనాలి."

"అలాగే," జాన్ అన్నాడు. "ఈసారి ఎలా ప్రవర్తించాలో నాకు తెలిసింది."

జాన్ ముందుకు సాగిపోయాడు. నడుస్తూ హుషారుగా ఈల వేస్తున్నాడు. కొంత దూరం వెళ్లిన తరవాత కొంతమంది కలిశారు. మాంసం అమ్మే వ్యక్తి, అతని కొడుకులు బజారులో బలిసిన పందులను కొని, ఇంటికి తిరిగి వెళుతున్నారు.

పెళ్లి కొడుకు, పెళ్లి కూతురు చెప్పినది జాన్‌కి గుర్తు వచ్చింది. అతను తన టోపీని ఊపాడు. “శుభాకాంక్షలు!” అంటూ పెద్దగా అరిచాడు.





అలా అరవటం, చేతులు ఊపటం వల్ల పందులు భయపడిపోయాయి!

అవి అరుస్తూ అన్ని దిక్కులకు పరిగెత్తాయి. వాటిని పట్టుకోటానికి మాంసం అమ్మే వ్యక్తి కొడుకులు పరిగెత్తారు.

మాంసం అమ్మే వ్యక్తికి చాలా కోపం వచ్చింది. అతను జుట్టు పీక్కున్నాడు. “ప్రవర్తించే పద్ధతి అది కాదు!” అతను అరిచాడు. “ఈసారి, మాట్లాడేటప్పుడు మాట మెల్లగా ఉండాలి. మీకు మంచి జరగాలి అని చెప్పాలి, ఒక్కొక్క దాని స్థానంలో రెండు పందులు రావాలని చెప్పాలి.”

“అలాగే,” అన్నాడు జాన్. “ఈసారి ఏం చెయ్యాలో నాకు తెలిసింది.”

తరవాత వెర్రిబాగుల జాన్ తన దారిన వెళ్లసాగాడు. అతను సంతోషంగా కూనిరాగం తీస్తున్నాడు. అంతలోనే అతనికి ఒక రైతు కనిపించాడు. అతను తన పొలంలో కలుపు తీస్తున్నాడు.

మాంసం అమ్మే వ్యక్తి చెప్పింది వెర్రిబాగుల జాన్‌కి గుర్తు ఉంది. "మీకు మంచి జరగాలి," జాన్ చెప్పాడు. "ఒక్కొక్క దాని స్థానంలో రెండు రావాలి."

రైతు కోపంతో రేగిపోయాడు, అతని ఛాతీ పొంగి చొక్కా గుండీలు ఊడిపోయాయి. "నాకు కలుపు ఎక్కువ కావాలా?" అతను అరిచాడు. "ఈసారి, ఇలాంటి పిచ్చి మాటలు మాట్లాడవద్దు. దానికి బదులు సహాయం చెయ్యి."

"అలాగే," అన్నాడు జాన్. "ఈసారి ఏం చెయ్యాలో నాకు తెలిసింది."



వెర్రిబాగుల జాన్ తన దారి వెంట ముందుకు సాగాడు. నడుస్తూనే సంతోషంతో నాట్యం చేస్తున్నాడు. త్వరలోనే తెల్లని టోపీలు పెట్టుకున్న ఇద్దరు వ్యక్తులు కలిశారు. వాళ్లిద్దరూ రోడ్డు మధ్యలో కొట్టుకుంటున్నారు. రైతు చెప్పింది జాన్ గుర్తు చేసుకున్నాడు. అతను ఆ ఇద్దరి దగ్గరకు పరిగెత్తాడు. “నేను మీకు సాయం చేస్తాను!” అన్నాడు.

ఆ ఇద్దరు కొట్టుకోవటం ఆపేశారు. అంతేకాదు, వాళ్లు నవ్వటం మొదలుపెట్టారు. ఊపిరాడనంతగా వాళ్లు నవ్వారు. “ఇటువంటి పిచ్చి మాటలు మాట్లాడకూడదు,” వాళ్లు జాన్‌కి చెప్పారు. “ఈసారి, అయ్యలారా, దయచేసి కొట్టుకోకండి అని చెప్పాలి!”

“అలాగే,” అన్నాడు జాన్. “ఈసారి ఏం చెయ్యాలో నాకు తెలిసింది.”







ఎట్టకేలకు వెర్రిబాగుల జాన్ బజారుకి చేరుకున్నాడు. తన కోడిని అమ్మి బంగాళాదుంపలు కొన్నాడు. తరవాత పట్టణమంతా తిరుగుతూ అక్కడి దృశ్యాలను ఆస్వాదించసాగాడు.

కుండలు చేసే ఒక వ్యక్తిని చూశాడు. ఆమె మట్టితో అందమైన పూల పాత్రలు తయారు చేస్తోంది. “అమ్మ కోసం అటువంటిది ఒకటి కొనటానికి సరిపడా డబ్బు ఉంటే ఎంత బాగుండును,” అనుకున్నాడు జాన్.

బజారులో బొమ్మలు, ఆట వస్తువులతో నిండిన బల్లలు ఉన్నాయి. డోళ్లు, కంజీరాలు ఉన్నాయి. కంకణాలు, ఉంగరాలు ఉన్నాయి. భయపెట్టే పెద్ద ముఖపు తొడుగులు, చిన్న కొయ్య విగ్రహాలు ఉన్నాయి.

ఎక్కడ చూసినా నోరూరించే తినుబండారాలు ఉన్నాయి. తుప్పు పట్టిన చక్రం మోత చేసినట్టు అతని పేగులు మోగాయి. "వీటన్నిటినీ కొనగలిగితే ఎంత బాగుండును!" అనుకున్నాడు జాన్.



“ఆలస్యమైపోతోంది, ఇంటికి వెళ్లాల్సిన సమయం అవుతోంది,” అనుకుని బంగాళా దుంపల బస్తా మోసుకుంటూ జాన్ నడుస్తున్నాడు.

ఆ బస్తా చాలా బరువుగా ఉంది. జాన్ అలసిపోయి ఉన్నాడు. ఒక చిన్న కునుకు తీస్తే ఎలా ఉంటుంది?

ఎందుకైనా మంచిదని జాన్ ఒక చెట్టు ఎక్కాడు. గట్టిగా ఉన్న కొమ్మ చూసుకుని, బంగాళా దుంపల సంచి మీద తల పెట్టి నిద్రపోయాడు.

జాన్ నిద్ర పోతుండగా సూర్యుడిని నల్లని మబ్బులు కప్పేశాయి. ఆకాశం ఉరుముతోంది. వాన చినుకులు పడసాగాయి. వానకి తడవకుండా ఉండటానికి ముగ్గురు మనుషులు పరిగెత్తుకుంటూ ఆ చెట్టు కిందకు వచ్చారు. వాళ్లు దొంగలు. బంగారం ఉన్న సంచిని వాళ్లు దొంగలించారు.

“ఎంత బంగారం ఉందో చూద్దాం!” అంటూ దొంగల నాయకుడు సంచిని తెరిచాడు.

“ఇప్పుడు లెక్క పెడతావా!” అరిచాడు రెండవ దొంగ.
“నేను లెక్క పెడతాను!” బొబ్బరించాడు మూడవ దొంగ.
“నోరు ముయ్యండి! నేను చెప్పింది మీరు వినాలి!” కేకపెట్టాడు ముఠా నాయకుడు.





ఆ అరుపులకు వెర్రిబాగుల వేమయ్యకి మెలకువ వచ్చింది. అతను లేచిన కుదుపుకి బంగాళాదుంపల సంచి చిరిగిపోయింది. చెట్టుకింద పోట్లాడుకుంటున్న మనుషులను అతను చూశాడు. తెల్ల టోపీలు పెట్టుకున్న వాళ్లు చెప్పింది అతనికి గుర్తు వచ్చింది. "అయ్యల్లారా, పోట్లాడుకోకండి!" అంటూ జాన్ అరిచాడు.

పైనుంచి వచ్చిన ఆ మాటలను దొంగలు విన్నారు. అంతలో, పెద్ద వాన చినుకుల మాదిరి వాళ్ల మీద బంగాళా దుంపలు పడసాగాయి. అయ్యోయ్! బాబోయ్! నాయనోయ్! "వాన దేవుడు మనల్ని శిక్షించటానికి వచ్చాడు!" అంటూ అరుస్తూ, బంగారం సంచిని అక్కడ వదిలిపెట్టి ఆ దొంగలు పారిపోయారు.



వెర్రిబాగుల జాన్ చెట్టు మీదనుంచి కిందకి దిగాడు. కింద ఉన్న బంగాళా దుంపలు చూశాడు. బంగారు నాణాలు చూశాడు. ఆ నాణాలను సంచిలోకి ఎత్తుకుని ఇంటికి వెళ్లాడు.

"బంగాళా దుంపలు తెచ్చావా?" అమ్మ అడిగింది.

"లేదు, అమ్మా. కానీ, ఏం తెచ్చానో చూడు." జాన్ వాళ్ల అమ్మ ఆ సంచి తెరిచి చూసింది. ఆశ్చర్యంతో ఆమె కళ్లు పెద్దవయ్యాయి. "ఇంత బంగారం నీకు ఎక్కడిది?"

"ఏముంది," చెప్పాడు జాన్. "నువ్వు చెప్పినట్టే చేశాను. దారిలో కలిసిన వాళ్లందరితో మర్యాదగా ప్రవర్తించాను."



ఆ రోజు నుంచి వెర్రిబాగుల జాన్, వాళ్ల అమ్మ సంతోషంగా ఉన్నారు.